శ్రీ సాయి శతకద్వయం

ప్రథమ ముద్రణ : విక్రమ కార్తికం - నవంబర్ 2000
ప్రతులు : 1000

వెల : రూ. 15/-

గ్రాఫిక్స్ :
**యాపిల్ గ్రాఫిక్స్**
6-1-816, మార్కెట్ దగ్గర,
ఖైరతాబాదు, హైదరాబాద్ - 4.
ఫోన్ : 3231229

ప్రింటర్ :
**మిలీనియం ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
బి.ఎస్.ఆర్. అపార్ట్‌మెంట్స్, వీధి నెం. 9,
ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004.
ఫోన్ : 6570900

ప్రతులకు :
**కపిలవాయి లింగమూర్తి**
ఇ.నెం. 17-242,
వాణీసదనం, విద్యానగర్ కాలనీ,
నాగర్ కర్నూలు - 509 209.
ఫోన్ : 08540-26437



# ఓం

1. శ్రీకరా షిరిడి వాసా ! చిద్రూప ! చిత్రచిత్ర ప్రభావా !
శోకాపహార ! వరదా ! కరుణించు ! శరణంటి సాయిసాయి.

2. వింటినీ నీమహిమలు - కనులార - గంటినీ వైభవమ్ము
బంటుగా నన్నేలుకో - పరమాత్మ - భగవంత సాయిసాయి.

3. ఆది భిక్షు స్వరూప - అవతార - మందితివి పత్రిలోన
వేదాంత వీధిగాను - షిరిడీని - వెలయింప సాయిసాయి.

4. తెల్లమలపై ఎప్పుడు - జంగమై - తిరిగినావోయిప్పుడు
ఇల్లిలు ఫకీరువగుచు - షిరిడిలో - నేగితివి సాయిసాయి.

5. చిత్ర చర్యలను జూపి - లోకాన - చిత్తవిభ్రమముగొల్పు
అత్రి పుత్రుండ వీవు - ఈరూప - మందితివి సాయిసాయి.

6. ఆలోకపీఠమందు - వసియించు - అల్లావు జీసెసుడవు
ఈలోక పుణ్యమునను - ఇలపైని - వ్రాలితివి సాయిసాయి.

7. ఒకవేళలో కబీరు - మరియును - ఒక వేళ నానకుగను
సకల సాధులు నీవయై - యొప్పితివి - జగమందు సాయిసాయి.

8. మతము కులముల కవ్వలి - మనిషివై - మనినావు నీవు జగతి
గతమెంతో నీదెఱుంగ - గలరెయా - క్షితిలోన సాయిసాయి.

9. హిందు ముస్లిములు నీకు - ఇద్దరు - యిన చంద్రులట్లుకనులు
అందరు నీకు సమమె - మతములు - ఆలాగె సాయిసాయి.

10. చందనోత్సవ మిష్టమో - శ్రీరామ - చంద్రునుత్సవమిష్టమో
చందమెరుగుదురెవ్వరు - నీయొక్క - చరితంబు సాయిసాయి.

11. అల్లాకు పర్దవేసి - తుర్కీలు - అతని చూడగరాదన
అల్లాను జూచి హిందు - జనమైక్య - మనరైరి సాయిసాయి.

12. బ్రాహ్మణుల యింట బుట్టి - వర్ధిల్లి - ఫక్కీరు యింటిలోన
బ్రహ్మావాదిగ నుంటివి - పరమార్థ - మందించి సాయిసాయి.

13. వేషాన ముస్లిముడవు - హృదయాన - వేదర్షి వరుడవీవు
విశ్వమానవుడ వీవు - నీకొక్క - విధమున్నె సాయిసాయి.

14. పరమగురులే బద్దైదు - వారిలో - పరమాత్ములైదుమంది
పరమాత్ములందునీవు - జగమందు - వర్యుడవు సాయిసాయి.

15. నీగురువు వేంకటుండు - శిష్యుడవు - నీవెమో విఠలుడవు
సగుణనిర్గుణములంచు - మిమ్మెప్డు - స్మరియింతు సాయిసాయి.

16. వేదాల్ ఖురాను బైబిల్ - ఒక్కటే - వేర్వేరుగావు నీకు
బోధించినావు సకల - మతముల - భూమమ్ము సాయిసాయి.

17. ఇటుకపై నిలిచి కృష్ణు - డానాడు - ఇలలోన విఠలుడయ్యె
ఇటుకతో నుండి నీవు - ఈనాటి - విఠలుడవు సాయిసాయి.

18. షిర్డి ఎంతటి పుణ్యము - చేసెనో - చిన్న గ్రామంబులందు
క్షేత్ర రాజంబుగాను - ఈనాడు - చెలగుటకు సాయిసాయి.

19. షిర్డియే శ్రీ చక్రము - అందలి - సింహాసనమున నీవు
శ్రీదేవి రూపమగుచు - చిత్కళను - చెలగితివి సాయిసాయి.

20. వేపక్రిందను కూర్చొని - వేగువై - వేదాలు పలికినావు
ఆపలుకు నిజమెరింగె - తొలిసారి - ఆచాందు సాయిసాయి.

21. పారిభద్రంబునంద - నమువీడి - భక్తితో నిన్నుగొల్వ
తీరైన నింబమగుచు - షిర్డిలో - నిలిచెనో సాయిసాయి.

22. నినుగొల్చువారి సకలా - రిష్టములు - నిరసించవలెనటంచు
వినుమోక యొకటి యిచట - వేపయై - వెలసెబో సాయిసాయి.

23. తననీడలోన నీవు - గూర్చుండ - తథ్యముగా నింబము
ఘనమైన తపము నెంత - జేసెనో - కాశ్యపిని సాయిసాయి.

24. వామహస్తంబు చేత - దక్షిణపు - పాదంబు పెనచినట్టి
నీయోగ మూర్తినేను - ధ్యానింతు - నిత్యంబు సాయిసాయి.

25. వామ చారమునగూడ - సమయమా - ర్గమ్ము సాధించవచ్చు
నని తెల్పు నీదుచర్య - లోకాని - కని యెంతు సాయిసాయి.

26. నీవు గూర్చున్న రౌతు - శ్రీచక్ర - నిలయ త్రికోణమగును
ఆదియోగులందరికిని - ఆరాధ్య - మగు చోటు సాయిసాయి.

27. నీవు గూర్చున్న రాయి - రాయియా - నిక్కముగనెంచి చూడ
ఏమేరువునకు సుతుడో - కాకుండ - నెట్లుండు సాయిసాయి.

28. చింతామణీరత్నము - చేతిలో - నట్కాగ నిల్చెనీకు
వింతగా నీవు షిర్డి - వాసివై - వెలయంగ సాయిసాయి.

29. తనర నక్షయ పాత్రయే - నీచేత - తంబిరేలై నిలిచెనో
జగతిలో నటుగానిచో - నీకది - తగునెట్లు సాయిసాయి.

30. మార్చినావు మసీదును - ద్వారకా - మాయిగాను అలావును
తీర్చినావు ధునీగను - చిత్రమా - నీమాయ సాయిసాయి.

31. ఎన్నికష్టంబులైన - భూమిపై - నిన్నుదల్చిన మాయము
ఎన్నగా విఘ్నపతివి - నీవెగా - యిలలోన సాయిసాయి.

32. బుద్ధి బలము యశమ్మును - ఈయగా - సిద్ధులెవ్వరుయింకను
సిద్ధులందాంజనేయ - సిద్ధుడవు - క్షితిలోన సాయిసాయి.

33. ఆపిపీలిక బ్రహ్మమం - దేరూప - మవధరించెదవో నీవు
ఏపగిది నేరనగును - నీలీల - లెడ్డెలకు సాయిసాయి.

34. బాబాయనే పేరుకు - నీచేత - భాష్యంబుగలిగె నేడు
బాబాల వేషమునకు - నౌకరీతి - పట్టెయ్యె సాయిసాయి.

35. ఏబదారక్షరాల - పాండిత్య - మెంతనీనామమునకు
ఏపగిది సాటి వచ్చు - నబ్ధికిని - ఏటివలె సాయిసాయి.

36. సర్వభూత సమత్వము - ఇలకును - చాటి చెప్పంగ నీవు
సర్వ జీవుల రూపమై - కనిపించి - తుర్విలో సాయిసాయి.

37. పంచభూతాలు నీదు - నాజ్ఞలను - పాటించినడుచుకొనెను
సంచరించంగ నీవు - షిరిడీలో - జనుడవై సాయిసాయి.

38. జ్యోతిష్యగ్రహములెల్ల - నీయాజ్ఞ - చొప్పునను వర్తించెను
నీతత్వ మెరుగ వశమె - మూఢులకు - నిత్యంబు సాయిసాయి.

39. ఓషధీ చయములెల్ల - నీచేత - నోగుగా వర్తించెను
వైషమ్యముడిగితాము - నీమాట - పాటించి సాయిసాయి.

40. తనువు జూచుక గర్వము - జనులకు - ధనము జూచుకగర్వము
తన వెంటనంటివచ్చు - ధనమేదో - కనలేరు సాయిసాయి.

41. పెట్టినదెపరుల కింత - పరమందు - పెట్టుబడి యౌనుగాని
కట్టి పెట్టిన మూటలు - రాలేవు - కాటికిని సాయిసాయి.

42. అర్థికిన్ తృణమొ పణమొ - విదిలించ - నట్టి వారల బ్రతుకులు
వ్యర్థమౌ జగతి యందు - కనలేరు - స్వార్థులై సాయిసాయి.

43. ఆలు బిడ్డలు బాంధవు - లార్జనకు - పాలివారంతెగాని
కాలుడెప్పుడు బిల్చునో - ఆనాడు - కారెవరు సాయిసాయి.

44. ఎంతబలగంబున్నను - వారంత - సంతలోపలివారలే
వింతయౌయెవరి కెవరు - గారయ్య - పృథివిలో సాయిసాయి.

45. తన పేరు మరచునట్టి - మనుమనికి - తాను సంపాదించును
తనసుగతికేదివలయు - కనలేడు - మనుజుండు సాయిసాయి.

46. ఆస్తిపాస్తుల యాశకు - తలిదండ్రి - నాదరించెడి పుత్రులు
వాస్తవంబుగ పుత్రులా - జగమందు - వారసులు సాయిసాయి.

47. పండితుండైననేమి - శాస్త్రార్థ - మండింతుడైన నేమి
గుండెలోనిను గొల్వని - జన్మంబు - దండుగే సాయిసాయి.

48. ఆగమాలెన్ని జదువ - నేమిటి - ఆచరణలేకయున్న
ఆగమైపోవగానే - అవిదారు - లగుచుండు సాయిసాయి.

49. గొప్పకులమైననేమి - నాడులో - గొప్పతనమైననేమి
ఒప్పుగా నినుగొల్వని - జన్మంబు - ఒప్పునే సాయిసాయి.

50. గొప్పకులమంచునరుడు - గర్వించి - తప్పుజేయుచునుండును
చెప్పులను గుట్టనేమి - నినుగొల్వ - శ్రేష్ఠుడే సాయిసాయి.

51. కులమెంతదైననేమి - మనుజుండు - గుణములేకున్నప్పుడు
బలమెంతగలుగనేమి - ఓర్పుతో - గెలుచునా సాయిసాయి.

52. ధనము దర్పము చేతను - ధరపైన - మనవచ్చు పెక్కుగతుల
మనములో నీదాసుడై - ఈజనుడు - మనలేడు సాయిసాయి.

53. తెలియదదంచనగరాదు - జనులకు - తెలిసినంతైనగాని
విలువెరిగి యాచరింప - విశ్వాన - ఫలముండు సాయిసాయి.

54. పరవారినాదుకొనని - మనుజుండు - పశువుగాకను యేమిటి
ధరలోన పశువు మేలు - తనదాని - కనిపెట్టు సాయిసాయి.

55. ఎంత సంపాదించినా - అంతగా - నిహమునే బెంచుకొనును
సుంతైన పరముగూర్చి - లోకంబు - చింతిలదు సాయిసాయి.

56. పరధనంబుల కోసమై - ఎల్లపుడు - ప్రాకులాడుచునుండును
ఎరుగరు తమధనంబు - చివరకు - నేమౌనో సాయిసాయి.

57. పరనింద జేయువార - లెరుగరు - తమనిందజేయువారి
ఎరిగితె పరులనింద - లకుతాము - యేగేర సాయిసాయి.

58. కనిపించునవియెల్లను - నిత్యంబు - కావుకావని యెరిగియు
కనువెఱ్ఱి చేత జనము - సత్యంబు - గనలేరు సాయిసాయి.

59. చావునిక్కంబంచును - సర్వులకు - చక్కగా దెలియుగాని
చావుపిమ్మట నేమిటి - తనచావు - కానరు సాయిసాయి.

60. అవసరాలను బెంచుక - మానవుం - డారాట పడునుగాని
అవి యెంత తక్కువైన - ఆహాయి - అంతంత సాయిసాయి.

61. శ్రామికునకున్న హాయి - జగమందు - శ్రీమంతునకు నుండునా?
శ్రీమంతమే సుఖంబు - అనినేడు - చింతించు సాయిసాయి.

62. శ్రమచేతనే సుఖంబు - జనులకు - శ్రమ చేతనే ధనంబు
శ్రమ లేక జనుల ప్రగతి - శూన్యంబు - జగతిలో సాయిసాయి.

63. కష్టపడు చుండువాడే - జగమందు - కనుచుండు సుఖముగాని
ఇష్టపడు వాడు సుఖము - కష్టంబు - నేమరడు సాయిసాయి.

64. సుఖరోగి యాచుమనిషి - తనకదే - సుఖమంచు భావించును
సుఖమంటె అర్థమేదో - కనలేరు - సుప్తులై సాయిసాయి.

65. లోకంబు కనులుగప్పి - మనవచ్చు - లేకియైగానినరుడు
నీకనులు గప్పినరుడు - మననౌనె - లోకాన సాయిసాయి.

66. పరచింత మాని మనిషి - ఇహమందు - పరుగువారుచునుండును
పరచింతలేనినాడు - తనపాటు - వ్యర్థంబు సాయిసాయి.

67. ధనము చేతను పుణ్యము - కొనవచ్చు - మనుజుండు కొంత కొంత
తన మనశ్శాంతినెట్లు - కొనగల్గు - దానితో సాయిసాయి.

68. ఎక్కువౌ చెరువునీరు - కట్టపై - కెక్కి చేటగురీతిని
ఎక్కువౌ ధనము నరుని - సుఖమున - కెసరెట్టు సాయిసాయి.

69. మరణమంతంబుగాదు - దేహికి - మరల పుట్టుక తప్పదు
తిరిగి పుట్టని రీతిని - యిప్పుడే - తెలియాలె సాయిసాయి.

70. మరణమే యంతమంచు - ఆపైన - మరియేమిలేదటంచు
మొరిగేటి వారలెల్ల - నీమాట - లెరుగరు సాయిసాయి.

71. మురికికాయంబు జూచి - జనులెల్ల - మురిసిపోవుచునుందురు
పరికి కంపని కానరు - ఈజన్మ - వాసనలు సాయిసాయి.

72. రేలకాయలు జూచిన - నక్కవలె - రేబవల్ భోగములకు
చాలగా భ్రమసి భ్రమసి - తుదయందు - చచ్చేరు సాయిసాయి.

73. సాలీడుబొడ్డులోని - దారమ్మె - సంసారమొక్క క్షణము
తేలదు తెగదు దీని - తెగదెంపి - పాలించు సాయిసాయి.

74. కొంగ జపములు జేసెడు - వారలు - దొంగలీనాడు బలువు
అంగడిది ఎవరినేమి - అనలేము - అవనిలో సాయిసాయి.

75. జనులు కుమ్మరి పురువుగా - సంసార - జంజాట మంటకుండ
మననేర్చునాడె జగతి - నాతండు - నినుజేరు సాయిసాయి.

76. తల్లిదండ్రియునుగురువు - మరియును - ఎల్లబాంధవులు నీవె
కల్లోలపడితినేను - సంసార - కడలిలో సాయిసాయి.

77. బాల్యంబు నందు నేను - నాటలకు - భ్రమసి నానెంతగానో
కార్యంబు లెరుగకుండ - కాలంబు - గడిపితిని సాయిసాయి.

78. కౌమార ప్రాయమందు - పెద్దల - కడజేరిసేవజేయ
సోమరిగ తిరిగినాను - నీచింత - నేమారి సాయిసాయి.

79. వయసుకాసింతరాగ - నెటనుండి - వచ్చెనో కామశక్తి
పవలురాతురులెప్పుడు - భామల - పలవరమె సాయిసాయి.

80. వయసు పిటపిటలాడగ - చేసితిని - వయసుతప్పులనుకొన్ని
నయమార్గమెఱుగనపుడు - నన్నెట్లు - నడిపెదో సాయిసాయి.

81. పరకాంతలను జూచిన - యీమది - పరుగులెత్తుచునుండును
మరుడెంత మాయగాడో - మననీడు - మానవుల సాయిసాయి.

82. ఒక్కొక్క యింద్రియంబు - వడిదప్పి - స్రుక్కిపోవుచునున్నను
చిక్కనగు కామవాంఛ - యిదియేమి - చిత్రమో సాయిసాయి.

83. వృద్ధదశయందైనను - యీయొక్క - బుద్ధిమారదుయింకను
పెద్దదగునాశయింక - దీనిల్లు - పీకేయ సాయిసాయి.

84. ఎన్నెన్ని జన్మలెత్తి - భూమిపై - నీజన్మదాల్చినానో
ఇన్ని జన్మలకు నేను - నీవైభ - వముగంటి సాయిసాయి.

85. పశుపక్షికీటమగుచు - యీనేల - ప్రాకులాడినవాటివి
వాసనలు నన్నువిడిచి - యిప్పటికి - వదలవు సాయిసాయి.

86. కామక్రోధాలు రెండు - మానవుని - కడదాక వేధించును
నామనసునుండి వాని - చివరంట - నణచేయి సాయిసాయి.

87. పరుల మేలునకోర్వదు - పాపిష్టి - మనసునేనేమి జేతు
పరమాత్మదాని నెటుల - సరిజేసి - మనిచెదో సాయిసాయి.

88. కాలంబ దెంత గడువ - నీయహం - కారంబువిడువబోదు
ఏలీలదీని గెలువ - జాలుదునో - ఎరుగను సాయిసాయి.

89. చిత్తవిభ్రమము లెన్ని - గల్పించు - చిత్తమే వేళలందు
ఎత్తరిని వాని బారి - బడకుండ - నేలవే సాయిసాయి.

90. మనసు నిల్పంగ గురులు - ఎన్నెన్ని - మార్గాలు చూపినారు
కననీదు పాద మొకటే - దానిని - కట్టేయ సాయిసాయి.

91. సుఖములన్మరిగి మనసు - నీచింత - సుంతైన చేయబోదు
వికటమౌ పనులకైతె - నేవేళ - వెట్టైత్తు సాయిసాయి.

92. మనుజ జన్మంబునెత్తి - నేచాల - మాయలోబడితిదేవ
మనిషి కన్నను యడవిలో - జంతువై - మనమేలు సాయిసాయి.

93. ఏల బ్రాహ్మణ జన్మము - ఇలపైన - నేల పండితపట్టము
చాలునీ వాకె లూడ్వ - సుగతికి - జనవచ్చు సాయిసాయి.

94. చేతులారగ దానము - నెవ్వరికి - చేసినేనెరుగనయ్య
ఏతీరునన్ను కరుణ - జూతువో - నాతండ్రి సాయిసాయి.

95. ధర్మకార్యంబులేవి - చేయంగ - తలపెట్టలేదునేను
కర్మమే మనుచున్నదో - నన్విడక - కావవే సాయిసాయి.

96. పరులమేలునకెప్పుడు - యేలీల - పాటింతబడగలేదు
తిరముగా నాలాభమే - జూచుక - తిరిగితిని సాయిసాయి.

97. పాడుపనులెన్నొనేను - చేసితిని - పాపిష్టివాడనగుచు
వీడధముడంచు నన్ను - దయమాలి - విడకయ్య సాయిసాయి.

98. ధనధాన్యచింతెగాని - ఏనాడు - దైవచింతన చేయను
ఏనలేని బాలిశుడను - నన్నెట్టు - లేలెదో సాయిసాయి.

99. చిక్కరానటువంటిదీ - సంసార - చిక్కమున చిక్కినాను
పక్కినై పోయినాను - దయజూచి - పాలించు సాయిసాయి.

100. సంసారమునకు నేను - ఎంతెంతో - చాకిరీసల్పినాను
పాంసనుడనై నిల్చితి - నాతండ్రి - పాలించు సాయిసాయి.

101. సంసారమందునేను - ఎన్నెన్నొ - హింసలను గుడిచినాను
సంసారమిక చాలును - నన్నేలు - సద్గురూ సాయిసాయి.

102. ఆలుపిల్లలు బలగము - నావార - లనిమోసపోతినేను
కారుకారని తెలిసెను - ఈనాడు - కరుణించు సాయిసాయి.

103. నినుగొల్వని జన్మము - వ్యర్థంబు - నిన్ననే తెలిసెనాకు
ఇన్నాళ్లుగాన నైతి - మొఱకునై - ఇలలోన సాయిసాయి.

104. కలవారిగాంచినపుడు - మర్యాద - ఘనముగాజేతుగాని
ఇలలోనలేనివారి - గతియేదో - కలగాన సాయిసాయి.

105. పేదవారలగాంచియు - ఎపుడేని - చీదరించితిగాని
పేదలేనీకెప్పుడు - చూడంగ - ప్రియమంట సాయిసాయి.

106. సాటివానిని మనిషిగా - జూడని - మేటిలోకాన నన్ను
ఏటికిని బుట్టగాను - చేసితివి - ఇకనెట్లు సాయిసాయి.

107. ఆపదలు గల్గునపుడె - వైరాగ్య - మంతరంగాన బొడము
ఆపైన తొలగిపోవు - ఇకనెట్లు - అవనిలో సాయిసాయి.

108. అన్ననను పుట్టింపకు - పుట్టింప - కున్న తప్పనిదైనను
నన్ను నీదాసులందు - నొకనిగా - నంపవే సాయిసాయి.

109. వింటినీ నీమహిమలు - కనులార - గంటినీ వైభవమ్ము
బంటుగా నన్నేలుకో - పరమాత్మ - భగవంత సాయిసాయి.



# శ్రీ సత్యసాయి శతకం

1. సాయింపుమురా సాయి భజనమును - సాయింపుమురా మూఢమతే
సాయి భజనమె సంసారంబున - సం రక్షించును శార్యమతే ॥సాయి॥

2. పుట్టపర్తిలో పుట్టిన వానిని - పుట్టుక నెరుగని పురుషోత్తంసుని
పుట్టు గిట్టుటలు లేని పదవిచే - పట్టినవారికి నిచ్చెడు వానిని ॥సాయి॥

3. మానవులందున తానొక డయ్యును - మానవు లందున పూర్ణపురుషుని
మానవు లందున మానుష శక్తుని - మానవులను మహిమావ తారుని ॥సాయి॥

4. అంతములేని మహత్తుల వానిని - అంతే తెలియని మహిమల వానిని
ఇంతింతగుచును ఇంతై యంతై - అంతట తానై వెలసిన వానిని ॥సాయి॥

5. ఇంటను వెంటను, జంటను కంటను - అంటి యుందునని అభయం బిచ్చుచు
ఒంటివారలకు సర్వము తానై - కంటికి రెప్పగ నిలిచిన వానిని ॥సాయి॥

6. ప్రాకృతు లెరుగగ జాలని లీలల - శ్రీకృష్ణుని వలె చిన్మయ రూపుని
ఆకృతి దాల్చిన భగవంతుని, భూలోక తపః ఫల పుంజము సాయిని ॥సాయి॥

7. అనంత గుణగం భీరుని ధీరుని - అనంత మహిమల యద్భుత పురుషుని
అనంత శాయిని యనంత రూపుని - అనంత మండల ప్రభవిష్ణుని మది ॥సా॥

8. ప్రకృతి శాస్త్రమున పట్టని వానిని - వికృతి నెఱుంగని విభవము వానిని
అకలం కంబగు చరిత్ర వానిని - సకలము తానై నిలిచిన వానిని ॥సాయి॥

9. అల్లా యతడే అక్బరు యతడే - ఎల్ల దేవతలు అతడే అతడే
చల్లని తల్లి సాయిని దలచిన - డుల్లును ఈభవ బంధము లెల్లను ॥సాయి॥

10. రాముడు కృష్ణుడు రామకృష్ణుడును - రమణ మహర్షియు రామదాసుడును
నామ రూపములు వేరగు గాకను - స్వామి యాతడే సర్వకాయముల ॥సాయి॥

11. నారాయణుడే నరుడుగ వచ్చును - నరుడుగూడ నారాయణు డగునను
పరమార్థమునకు ప్రత్యక్షంబగు - పురుషోత్తముని పుణ్యఫలంబని ॥సాయి॥

12. విశ్వకర్తయై, విశ్వభర్తయై - విశ్వాతీతుడు విశ్వేశ్వరుడై
విశ్వరూపుడై విశ్వంభరుడై - విశ్వవేద్యుడౌ విశ్వాతీతుని ॥సాయి॥

13. సాయిప దంబున సర్వసు పర్వులు - పాయక నెప్పుడు నుందురు కనరా
సాయీ యనుచును పిలిచిన చాలును - ఓయీ యనుచును పలుకు నెపుడురా ॥సా॥

14. సాయీ రాముడు సంసారులకు - కాయము దాల్చిన కల్పక భూజము
సాయీ నాథుడు సాధక తతులకు - సాయము చేసెడు చింతామణిరా ॥సా॥

15. అర్థులపాలిటి కమర ధేనువు - ఆర్తుల పాలిటి కశ్విని యుగ్మము
తీర్థుడు సంసారో త్తీర్ణులకును - కర్త సమస్త జగంబుల కెల్లను ॥సాయి॥

16. సేవా కార్యక్రమమే సాధన - సేవా కార్యక్రమమే తపమని
సేవే జగతికి కళ్యాణంబని - సేవా మహిమను చాటిన స్వామిని ॥సాయి॥

17. నర జన్మంబున పురుష జన్మమును - అరచేతనుబడు యుసిరిక ధాత్రిని
ఎరిగి దీని విని యోగ పరచితే - మరణము నీవెపు డొందవు జగతిని ॥సాయి॥

18. అహము చావకు న్నంతకాలము - ఇహమున చావులతో మిడిమేలము
అహము వీడగను నావల జాడుము - మహమే నీదరి జేరును గదరా ॥సా॥

19. గతి యున్నప్పుడె దానము చేయుము - మతి యున్నప్పుడె ధ్యానము చేయుము
మతిగతిదప్పి మంచములో బడు - తతిలో నేది యొనర్పగ జాలవు ॥సాయి॥

20. కోరిక లెంతగ ననుభ వించినా - పారము ముట్టవు యాశలు భూమిని
సారంబేదో యెరిగినచో ని - స్సారంబీ సంసారం బగురా ॥సాయి॥

21. ఎంతగ నీవును అనుభ వించినను - అంతు తీరనిది కామము భూమిని
కంతుని మాయను గెలువ కున్ననీ - యంతము జూచును యమధర్ముడురా ॥సా॥

22. దేహము నేనని యెంచకుమీ సం - దేహం బీభువి కాయం బెప్పుడు
దేహము లోపల నుండిన నిన్నును - సోహము చేతను తెలియగ వలయును ॥సా॥

23. విశాల మగునీ విశ్వములో నీ - విశాంత మేదో యెరుగుమురా
ప్రశాంతి నిలయము చేరక నీకు - ప్రశాంతి యెక్కడ దొరకదుపోరా ॥సాయి॥

24. తెలియ కుండనే రాత్రిం బవలును - దొరలుచు పోవును జీవిత ఘడియలు
మరణము తప్పని దని నీవెరిగియు - హరిని భజించవ దెందుకు మిత్రమ ॥సా॥

25. తొలి జన్మంబున యెవ్వరమో మరి - మలి జన్మంబున యెవ్వరమొ యిక
తొలిమలి నడుమల నాటకమున నొక - పలకాలంబీ భూమిక యగురా ॥సాయి॥

26. ఒక్కొక్క దినముగ జీవిత మంతయు - చుక్క చుక్కగా వడియును కనరా
నిక్కంబెరుగక మృత్యువు చేతికి - చిక్కి నప్పుడు యేడ్తువు గదరా ॥సాయి॥

27. అర్థము చుట్టుగ పరిభ్రమింతువు - వ్యర్థముగా నీ వెందుకు నెప్పుడు
అర్థము వెంటనె యాపద లన్నియు - తీర్థయాత్రకై వెడలును గప్పున ॥సాయి॥

28. కాలును జారిన నాలుక జారిన - వ్రేలను చూపును సుమియీ లోకము
కాలము దప్పిన వేళను యెవ్వరు - కనికర మునగని యాదుకొ నరురా ॥సాయి॥

29. ఔషధాలు పనిచేయని వేళను - అయిన వారు నిను గానని వేళను
ఆశలు సర్వం బుడిగిన వేళను - అయ్యో అనువా రెవ్వరు మిగలరు ॥సాయి॥

30. పట్టు పట్టుడిక లాభము లేదని - కట్టెలు పిడుకలు చూచెడి వేళను
చుట్ట పక్కములు యెందరున్ననీ - తిట్టు చూడరిది నిక్కము నిక్కము ॥సాయి॥

31. సంసా రముననె స్వర్గం బున్నది - సంసా రముననె నరకం బున్నది
సంసారము గుట్టెరిగియు తిరిగితె - సంసా రముననె మోక్షం బున్నది ॥సాయి॥

32. తరుణులు పురుషుల కెంతగ బంధమొ - పురుషులు తరుణుల కంతే బంధము
తరుణీ పురుషుల తత్వో న్ముఖులై - యరిగిన నాబ్రతు కుననే నాకము ॥సాయి॥

33. కొడుకులు కొడుకులు కూతురు లంచును - మిడుకుత రెందుకు లోకము తెలియక
కొడుకులు తండ్రిని పంచుక తినుటకె - పుడుతరు కలియుగ మందున నిప్పుడు ॥సా॥

34. తనువుప టుత్వము తప్పని నాడే - మనసు దృఢత్వము మలగని నాడే
కనులను జ్యోతి కలగని నాడే - వినరా సద్గురు సాయిని నాదము ॥సాయి॥

35. పాటవ ముడిగిన నీతనువేనీ - మాట వినదు యిక పరివారంబును
ఆడి పోసికొన నేలా పరిపరి - కాడువడుచు నీ సంసారంబున ॥సాయి॥

36. అష్టమ దంబులు అరిషడ్వర్గము - లిష్టము వచ్చిన గతినా డించును
సృష్టిని మానవ జన్మము కష్టము - నష్ట పరచుకొని నలగకు మాయను ॥సాయి॥

37. మేడి పండుసుమి మనయీ దేహం - వీడగ వలయును యీతను మోహం
వేడుకలకు తీరదురా దాహం - కాడు పడేయును ఈకలి వ్యూహం ॥సాయి॥

38. కాయము జగతిని బుద్బుద ప్రాయం - ప్రాయము జలక ల్లోల ప్రాయం
ఈయవి యెరుగుచు నీ వ్యవసాయం - చేయుట శ్రేయము కోసము న్యాయం ॥సా॥

39. మనసే కర్మల కెల్లను దాయం - మనసే మనిషికి తగిన సహాయం
మనసు చలించిన కలుగున పాయం - మనసచ లించిన చేకురు శ్రేయం ॥సా॥

40. కలిమి లేములను యిలను సమత్వం - కలిగిన వారికె యందును తత్వం
తెలివి గలిగియును యీ నిత్యత్వం - తెలిసిన యప్పుడె సుమి పరతత్త్వం ॥సా॥

41. సనకాదులు మరి జనకాదులు విని - చనిన మార్గమిది యేరా ఆదిని
చన దలచిన మరుజన్మలు మేదిని - అనరా సాయీరామని మదిని ॥సాయి॥

42. విషయ సుఖంబుల దగిలిన చిత్తము - విషమిం చునురా కర్మలు మొత్తము
విషయ వాసనలు దుఃఖని మిత్తము - ఋషిజీ వనముగ నడుపుము వృత్తము ॥సా॥

43. సంసా రంబును పెంచుక లోకులు - హింసా చరణులు నైరి యనేకులు
హంస నెరుంగ లోకులు కాకులు - పాంసనులై చెడిపోదురు మూకలు ॥సాయి॥

44. పశ్చిమ బుద్ధుల కెక్కడ సత్యము - పశ్చిమ సుద్దుల నెక్కడ నిత్యము
నిశ్చల బుద్ధిని గైకొని వ్రాత్యవి - పశ్చిత బుద్ధిని బూనుమ గత్యము ॥సాయి॥

45. త్యాగమె జగతిని అనుపమ యోగము - భోగము సోకిన వదలని రోగము
రాగము లోబడి పోయిన నాగము - సాగదు ముప్పున నీవైభోగము ॥సాయి॥

46. దైవ మెక్కడని దైవము లేదని - దైవము తోడ ప్రయోజన మేమని
కైవల్యము పనిలేని కల్పనని - దైవం బనుకడ ద్రోయకు మవని ॥సాయి॥

47. ఇరువ దేండ్లనా డిష్టము నాదని - పరుగులు వారుచు పరిపరి మేదిని
అరువది దాటిన నంతయు నీదని - శరణా ర్థుండయి చేరకు హరిని ॥సాయి॥

48. విధికి నరులతో బహు చెలగాటం - విధితో నరులకు సతి పోరాటం
విధిని జయించగ పడకుబ లాటం - మధు మధనునికై తెరువు కవాటం ॥సా॥

49. కాగల దేదియొ కాకను మానదు - రాగల దేదియొ రాకను మానదు
ఏగెడు కాలము నీకొర కాగదు - వేగిర వడునీ ధీమా సాగదు ॥సాయి॥

50. త్యాగమే జగతిని అనుపమ యోగం - భోగము సోకిన వదలని రోగం
రాగము లోబడి పోయిన నాశం - సాగదు ముప్పున నీవై భోగం ॥సాయి॥

51. తనువు గాలిలో పెట్టిన దీపం - మనసా దారం తెగిన పతంగం
ధనము కడలిలో లేచు తరంగం - కనవెం దుకురా వీని తతంగం ॥సాయి॥

52. కాషా యంబులు గట్టుట యెందుకు - వేషా లెన్నో వేయుట యెందుకు
దోషము మదిలో లేకున్నంతకు - దూషణ నిన్నెపు డంటదు జంకకు ॥సాయి॥

53. అన్యాయంబున గూరుచి విత్తము - పుణ్యాకార్యమున కిచ్చిన నిత్యము
అన్యులె రుగకున్నను ఈ సత్యము - మన్యు వెరుగు చుండును సాతత్యము ॥సా॥

54. శీలము దప్పిన యోగము లెందుకు - లోలత వీడని నిష్ఠల వెందుకు
బాలునివలె మనవలె నింతెందుకు - మూలం బదియే ముక్తికి పొందుకు ॥సా॥

55. వేదం బులతో వాదము లాడకు - సాధ సజ్జనుల సంగతి వీడకు
భేద వాదముల వైపున జూడకు - సాధు పలువలను జతకై గూడకు ॥సాయి॥

56. పనిచే యకనే ఫలితం బందగ - మనమున నెప్పుడు కోరకు ముందుగ
పనికిని తగిన ఫలితం బందక - జనులెం దరో ఈ భువిలో నుండగ ॥సాయి॥

57. దేవుని తోడుత బేర సారములు - త్రోవవు నెప్పుడు పాప భారములు
భావము నిష్కప టమున దూరములు - నీవిది యెరుగుము వార వారములు ॥సా॥

58. పరలో కానికి వచ్చును ధర్మము - నరలో కానికి తెచ్చును కర్మము
ఎరిగి నడుచుకో నీవీ మర్మము - ఎరుగక తిరిగితె యదినీ కర్మము ॥సాయి॥

59. పేద సాదలకు చేసిన దానము - మీది సుగతికిని యగును నిదానము
లేదన కున్నదె చాలును దానము - సాధు గతికినదె మేటి విధానము ॥సాయి॥

60. దేవుని భక్తియు దేశ భక్తియును - జీవుని కుండగ వలయును రక్తియు
ఏవం గుణములు నుండని వ్యక్తివి - నీవయి పోయిన జగతిన శక్తివి ॥సాయి॥

61. మట్టి బొమ్మగా జేసెను దేవుడు - గుట్టు దెలసియిది మనవలె జీవుడు
వట్టిగ ఎందుకు మరిచని పోవుడు - పుట్టుక సార్థక పరచుక పోవుడు ॥సాయి॥

62. తోలు బొమ్మవై యాడకు జగతిని - కీలు దెలిసికొని చూడుము సుగతిని
ప్రాలు మాలితివ నీపని ప్రగతిని - కోలు కొనవుసుమి చెందుచు నగతిని ॥సా॥

63. శక్తికొలదిని పేదల జూడుము - యుక్తితోడ వెను దీయుట వీడుము
భక్తితోడ భగవంతుని వేడుము - రక్తితోడ తన పాటలు పాడుము ॥సాయి॥

64. చీకటిలో చిరు దివ్వెవు నీవై - ఆకటి చిచ్చున కాదరు వీవై
లోకం బుననీ వంతునకై పర - లోకము కొరకై సేవింపుము మరి ॥సాయి॥

65. ఊరక చెప్పకు చేయని నీతులు - కోరకు మెప్పుడు అనుచిత రీతులు
పారము ముట్టని వెందుకు చేతలు - వారి నెరుంగరు సుమిదు ర్జాతులు ॥సా॥

66. దురుద్దేశ ములతో బజ్జాతులు - పొరుగువారి మేలోర్వని నేతలు
పరులకోసమై తీతురు గోతులు - చరమంబున తామే పడిపోతరు ॥సాయి॥

67. మనకా దర్శము గాంధిజి కోతులు - మనసున కెప్పుడు చూపా చేతులు
మను మార్గమ్ములు సుమ్మా నీతులు - మన దలచినచో విడువుము ఏతులు ॥సా॥

68. ఎన్ని జన్మములు నెత్తిన గానియు - ఎన్ని లోకముల కేగిన గానియు
కన్నని దలవని చోమన వారిని - ఉన్న చోటనే యుంచును భూమిని ॥సాయి॥

69. తనవారల తనవారని మురువకు - మన వారల మనువారని దలచకు
వెనుకో ముందో అందర మొకటే - చన వలసినదే సదనము వదలుచు ॥సాయి॥

70. పసితన మందున జ్ఞానం బెక్కడ - ముసలి తనంబున యౌవన మెక్కడ
కొసకుండవు గని యారెం డెడపెడ - మెసల కుండ బిస ద్రిప్పును తడబడ ॥సా॥

71. రేఖనుదుట తనకేలా గుండునో - లేఖుల కైనను మార్చగ రాదది
భూకా మందయి బ్రతికిన గాని - ఆఖరు నకునా రడుగుల నేలనే ॥సాయి॥

72. నీటుగ నెంతగ నుంచిన గానియు - పూటుగ మేవా మేపిన గానియు
పూట పూటకిది కాటికెగాని - వాటముగా పదినా ళ్లుండదురా ॥సాయి॥

73. కుడి యెడమలకును జూడవ దెందుకు - పడుచును లేచుచు పరుగుల వెందుకు
అడిగి తెచ్చుకున్నంతే చివరకు - అడియాశలు నీయాశలు మురువకు ॥సా॥

74. వంకర టింకర శంకల తోడ్రత్రి - శంకు స్వర్గమున పడకుము ధాత్రి
శంకరునకు నిడు చాలొక పత్రి - సంకటములు వైదొలగును మిత్రమ ॥సాయి॥

75. కులమును బలమును గలిగిన సర్వము - కలగించును సుమి జనులకు గర్వము
మెలకువ గలిగియు బ్రతుకుటె పర్వము - కలిమిని బలమును దలపక సర్వము ॥సా॥

76. ప్రాప్తం బైనది పదివే లనుకొని - తృప్తిం జెందవు నీవెం దులకని
సప్త ద్వీపము లబ్బిన నైనను - ఆప్తిం బొందెద వా యెపుడైనను ॥సాయి॥

77. చేయగ కూడని పాపము లెల్లను - పాయక చేయుచు కాశికి వెళ్లిన
పాయునె దోషము కానగ నొల్లరు - మాయకు లోబడి మానవు లెల్లరు ॥సా॥

78. ఇరువది నిండగ చేసిన తప్పులు - అరువది దాటిన కలుగును ముప్పులు
నరలో కంబున చేసిన యొప్పులు - పరలో కంబున దప్పును ముప్పులు ॥సా॥

79. జీవితంబులను సద్విని యోగము - గావించినచో నదియే యోగము
ఈవిచేతనీ యార్జన త్యాగము - గావించినచో నదియే యాగము ॥సాయి॥

80. కలకల నవ్వుచు చేసిన పనులకు - వలవల యేడ్చే ఫలితము గలుగును
తెలియగ వలెనీ కర్మ రహస్యము - తెలియక తిరిగిన కలుగును మోసము ॥సా॥

81. కలిమియు మిగులదు లేమియు నిలువదు - కలకాలం బొక తీరుగ నడువదు
కలిముల లేముల యలజడు లందున - చలనము నొందక తెలివిని గలిగియు ॥సా॥

82. పెద్దలు చూపిన దారిని నడువుము - గద్దరి చేతల నిపుడే విడువుము
హద్దు పద్దుగని యెప్పుడు నడువుము - ప్రొద్దుప్రొద్దునను సాయిని దలువుము ॥సా॥

83. గోవుల జంపుచు చెప్పులు దానము - గావిం చినచో గలుగదు పుణ్యము
జీవుల హింసను మానని వేళను - దేవు నెంత పూజించిన మెచ్చడు ॥సాయి॥

84. ప్రాయము వచ్చిన దని మురియుచును - నాయు వుతరిగిన దనుచును యెరుగరు
కాయము వట్టిది బుద్బుద ప్రాయము - మాయను ద్రోయును మనసును బుద్ధిని ॥సా॥

85. దినము దినంబును చచ్చెడు వారల - కనుగొను చున్నను బ్రతికెడు వారల
గనియిం కనునే బ్రతికెద ననుకొను - చునునీ వెప్పుడొ తరలుట నెరుగవు ॥సా॥

86. కాల ప్రవాహము నందున గొట్టుక - తేలుచు వచ్చిన కట్టెలు పుట్టుక
కాలపు మలుపున కలియును తొలగును - ఏలర యీ సంసృతిపై వలపును ॥సా॥

87. అధికారం బున్నంత కాలమును - మదిలో దలపరు నెప్పుడు శీలము
అదును దప్పి చేసిన వ్యవసాయము - ఒదవునె ఆకటికిని ఫలసాయము ॥సా॥

88. ఎంత జేసినను వదువదు సుమికా - సింత మిగులు వడి యుండు కాపురము
పంతముతో తెగదెంపు జేసికొని - చింత లుడిగి శ్రీహరి నేవేళను ॥సాయి॥

89. అంతరాత్మనీ యందలి సాక్షిర - అంతకంటె నీకెవ్వరు సాక్షిర
పంతంబులకు పోవక నీవుని - రంతరంబు నాసాక్షిని గనరా ॥సాయి॥

90. మోటారున గూర్చుండియు చూచిన - బాటే వెనుకకు పోవుట దోచును
బూటక మీసంసారం బింతే - సూటి నెరింగిన సుజ్ఞానులకు ॥సాయి॥

91. ఆడించే వాడొక్కడు నుండగ - ఆడెద నేనే యందురు నందరు
కీడు మూడు నందాకను సత్యము - జాడ నెరుంగరు జనులిది సత్యము ॥సా॥

92. దురితములెన్నో జేయుచు భూమిని - గురు పీఠంబులు నెక్కిన ఘనమా
పర పీడనతో గూరిచి ద్రవ్యము - పర మేశుని పూజించిన ఫలమా ॥సాయి॥

93. ధర్మము దప్పిన ధనమది కర్మము - శర్మము గూర్చదు గనుమీ మర్మము
ధర్మము మూలము స్వర్గము గోరిన - కర్మము మూలము ముక్తిని గోరిన ॥సా॥

94. కులవృత్తిని భువి హీనం బనుచును - చులకన సల్పకు మెప్పుడు గానీ
కులవృత్తిని సక్రమమున నడుపుట - ఇలలోపల జలజాక్షుని గొల్చుట ॥సాయి॥

95. అర్థము దెలిసిన నన్నిటి యందున - వ్యర్థం బనునది యుండదు గానీ
స్వార్థంబొకటే కూడదు జగతిన - పార్థము గాకను బ్రతుకగ వలయును ॥సా॥

96. అన్నము దేహము జీవుడు నారం - బెన్నగ దైవం బగ్ని రూపముగ
అన్నా తేజో బన్నంబులు యీ - కన్నుల కగుపడు దృశ్యం బంతయు ॥సాయి॥

97. ఆత్మ శోధనము జేసి కొనుము జీ - వాత్మవో మరి పరమాత్మవో నీవన
స్వాత్మ పరిచయము గలిగిన ఎడలమ - హాత్ముడ వగుదువు నీవుగూడను ॥సా॥

98. జీవుడు పురుషుడు ప్రకృతి దేహము - భావించుము నెల్లప్పుడు సోహము
నీవెఱుంగుమీ ప్రకృతి పురుషులను - కేవలుండవై పోదువు బుుషులను ॥సా॥

99. కాయిక మలములు కర్మమ లంబులు - పాయవు ఈఘట మునురే బవళులు
హేయమైన ఈ కాయంబును సుఖ - దాయం బనుచును యెందుకు మురియుట ॥సా॥

100.తొమ్మిది తొర్రల తోలు బంతియిది - నమ్మిక దప్పిన సహవాసము తుది
సుమ్మీ యెప్పుడు తుస్సుమనునోయీ - జిమ్మిక్కులను నమ్మకు మెప్పుడు ॥సా॥

101. అఖిల మతాలకు అల్లా ఒక్కడే - సకల జగాలకు సాయీ ఒకడే
నిఖిల శాస్త్రములు చెప్పేదొక్కటే - నికరం బింకను కనుగొన వేలను ॥సాయి॥

102.తనువుతోడ సంసారము జేయుము - మనసుతోడ సమ్మోహము బాయుము
మనసిజ సంహరు డపుడే మెచ్చును - మని యుండగనే మోక్షము నిచ్చును ॥సా॥

103.చదువుస నాతన సారధి నెప్పుడు - వదలుము దుర్జన ములతో చప్పుడు
హృదయము నిర్మల పరచుక నిలిచియు - కుదురుగ బుద్ధిని హరిపై నిలిపియు ॥సా॥

104.అద్భుత పురుషుం డగుశ్రీ సాయిని - సద్బుద్ధిని సే వింపుము నెప్పుడు
బుద్బుద ప్రాయం బగు నీ జన్మం - బుద్భవిం చుటకు సార్థకమగురా ॥సా॥

105.బ్రతికిన జీవిత మెటులో గడుచును - చితికిన పిమ్మట నేమగు నెరుగము
బ్రతికిన కంటెను చితికిన పిదపనె - అతి ముఖ్యమురా యందుకె నిత్యము ॥సా॥

106.మాయ లోనబడి సంసా రముకై - దేయని వేడుట యర్థమ పర్థమ
సాయు జ్యముదయ నేయుము మాకని - సాయిని వేడుట సార్థక మగుసుమి ॥సా॥

107.మనినను చనినను భగవన్నీ పద - వనజమ్ములకడ బెత్తెడు చోటును
కనికరించి దయ చేయుమ టంచును - అను దినమును నొక హారతి యిచ్చుచు ॥సా॥

108.వినా దైన్యమగు జీవన మిమ్మని - అనాయాస మగు మరణం బిమ్మని
చనేనాటికి సాయుజ్యమ్మని - అనాలస్యముగ వర్తీశుని మది ॥సాయి॥



# శ్రీ సత్యసాయి అష్టోత్తరం

శ్రీకర దత్తాత్రేయా సాయీ
శివతాయీ చిద్రూపా సాయీ
శ్రీపాదార్చిత క్షితిజన సాయీ
షిర్డీబాబా రూపా సాయీ
మహిమాన్విత శ్రీహస్తా సాయీ
మానవ విషయాతీతా సాయీ
బృందావన సంచారా సాయీ
మందస్మిత ముఖమండల సాయీ
పరమైశ్వర్య విధాతా సాయీ
పరమైశ్వర్య ప్రదాతా సాయీ
పంచమత ప్రతిపాదిత సాయీ
ప్రపంచ శాంతికామిత సాయీ
పత్రిక్షేత్ర సంభూతా సాయీ
పర్తి నిలయ సంచారా సాయీ

అక్షయాబ్ధి సంభూతా సాయీ
ఆర్ద్ర హృదయ సముపేతా సాయీ
భారద్వాజస గోత్రా సాయీ
భారత మతసంరక్షక సాయీ
ఈశ్వరాంబప్రియ నందన సాయీ
విశ్వజనావళి వందిత సాయీ
సత్యరూప నారాయణ సాయీ
స్తుత్యమార్గ సంసక్తా సాయీ
సత్య శివాత్మక సుందర సాయీ
నిత్య నిరంజన నిర్మల సాయీ
సర్వభూత హృద్వర్తీ సాయీ
సత్యధర్మ విజ్ఞాతా సాయీ
లోకావన యవతారా సాయీ
శ్రీకర దత్తాత్రేయా సాయీ

* * * * * * * *

ప్రశాంతి సదనా సాయీరాం
పాపవిదళనా సాయీరాం
కాషాయంబర సాయీరాం
కపర్దశోభిత సాయీరాం
అవాప్తకామా సాయీరాం
ఆశ్రితకల్పక సాయీరాం
చిద్ఘనమూర్తి సాయీరాం

చిత్సుఖవర్తి సాయీరాం
విభూతిదాతా సాయీరాం
విభూతిరూపా సాయీరాం
శివశక్తిప్రభు సాయీరాం
శ్రీలీలాకర సాయీరాం
భక్తార్తిహరా సాయీరాం
భవభయదూరా సాయీరాం

భజనానందా సాయీరాం హరియవతారా సాయీరాం
రాజాముకుందా సాయీరాం రత్నాకరకుల సాయీరాం
అనంతలీలా సాయీరాం రత్నోజ్వలయశ సాయీరాం
అనంతవైభవ సాయీరాం లీలామానుష సాయీరాం
సర్వజనప్రియ సాయీరాం పాలితసద్గుణ సాయీరాం
సర్వశక్తిధర సాయీరాం పాశవిదళనా సాయీరాం
అపాంతరాత్మా సాయీరాం ప్రశాంతిసదనా సాయీరాం

* * * * * * * *

పురాణపురుషా బాబాసాయీ త్రిగుణాతీతా బాబాసాయీ
పుణ్యనిదానా బాబాసాయీ అగణితవరదా బాబాసాయీ
కర్మధ్వంసీ బాబాసాయీ సత్యసనాతన బాబాసాయీ
ధర్మవివేకా బాబాసాయీ నిత్యవినూతన బాబాసాయీ
దుఃఖక్షయకర బాబాసాయీ యజ్ఞప్రియకర బాబాసాయీ
దూరీకృతభయ బాబాసాయీ అజ్ఞానహరా బాబాసాయీ
విశ్వప్రేమిక బాబాసాయీ విబుధవందితా బాబాసాయీ
శాశ్వతరూపా బాబాసాయీ విశ్వాతీతా బాబాసాయీ
మార్గదర్శకా బాబాసాయీ కారణజన్మా బాబాసాయీ
మనుమార్గగతా బాబాసాయీ కలియుగకపిలా బాబాసాయీ
తత్వబోధకా బాబాసాయీ వంశదీపకా బాబాసాయీ
సాత్వికహృదయ బాబాసాయీ సంశయహారీ బాబాసాయీ
సాధుజనావన బాబాసాయీ అనాదిపురుషా బాబాసాయీ
సాధకవరదా బాబాసాయీ అవతారాత్మక బాబాసాయీ

* * * * * * * *

సత్పురుషాయ నమోనమ సాయి
సత్యగుణాత్మ నమోనమ సాయి
సర్వజ్ఞాయ నమోనమ సాయి
సర్వేశాయ నమోనమ సాయి
ఆనందాయ నమోనమ సాయి
ఆర్తత్రాణ నమోనమ సాయి
కలుషవిదూర నమోనమ సాయి
కరుణామూర్తి నమోనమ సాయి
సుందరరూప నమోనమ సాయి
సుగుణాభరణ నమోనమ సాయి
సాధుప్రియాయ నమోనమ సాయి
వేదవిచార నమోనమ సాయి
శంకరరూప నమోనమసాయి
సంకటహరణ నమోనమ సాయి

సత్యరతాయన నమోనమ సాయి
శక్త్యావతార నమోనమ సాయి
సర్వాధార నమోనమ సాయి
గర్వవిదూర నమోనమ సాయి
సతతప్రసన్న నమోనమ సాయి
ప్రతిజనసులభ నమోనమ సాయి
భగవద్వాచ్య నమోనమ సాయి
భవ్యజ్ఞాన నమోనమ సాయీ
అభయకరాబ్జ నమోనమ సాయీ
అద్భుతకర్త నమోనమ సాయీ
అతులితధిషణ నమోనమ సాయీ
మంగళమూర్తి నమోనమ సాయీ
మంగళమయ్య నమోనమ సాయీ

